

# సూచన.

మానవుల మానసిక తత్వాలు అనేకములు. ఈనాడు సర్వసంగపరిత్యాగంచేసి విరాగిగా వుంటే—

రేపుకూడా అదే మనస్థైర్య ముంటుందని ఎవరూ గ్యారంటీ ఈయలేరు.

సృష్టికి ప్రతిసృష్టి చెయ్యగల విశ్వామిత్రుడు నయితం చలించాడు. ఇహ సామాన్యమానవుల సంగతి?

ఇట్లు,
రచయిత.



శ్రీరామ ప్రెస్, రాజమండ్రి.

౧

# ప్రకటన.

పంచమహాపాతకపట్నం గ్రామకాపురస్థుడు, గారెల గంగన్న అనే ఆసామీ సుమారు ఐదుసంవత్సరాలక్రితం గ్రామమునువొదిలి కాశీయాత్రకుపోయి, అక్కడ మరణించినట్లుగా తెలియవచ్చినది.

అతడు నిస్సంతుగా మరణించినాడుగనుక, అతనిపేర నమోదు కాబడిన సుమారు పాతిక వేలరూపాయిలఆస్తిన్నీ గవర్నమెంటువారికి చెందనైవుంది, కనుక సదరు గారెల గంగన్నకు వారసులుగాని ఋణదాతలుగానీ వున్నయెడల ఒక నెలరోజులలోపుగా జిల్లాకలక్టరుగారి సముఖానకువచ్చి. తమతమ హక్కులను ఆక్షేపణలను తెలువుకోవలసినది—

ఇట్లు,

'జిల్లా కలక్టరు'

అని ప్రకటించబడిన పత్రికలు పంచమహాపాతక పట్నంలో ప్రతిఒక్కరి చేతుల్లోనేగాకుండా, చుట్టుపక్కల గ్రామాల్లోకూడా గంగన్నను తెలిసివున్న ప్రతిఒక్కరిచేతుల్లోనూ వున్నాయి.

ప్రజలు గుంపులుగుంపులుగాకూడి యీవిషయమును గురించే చెప్పుకోవడం మొదలుపెట్టారు.

"పాపం చచ్చిపోయాడు—కాశీలో చనిపోవడం ఎంతపుణ్యాత్ములికి?"

అని ఒకరు—

'గారెల గంగన్నఅంటే యెవరోగాదండీ? స్వయానా మా పెద్దమ్మకొడుకు. నేను చాలాదగ్గరవారసుణ్ణి అవునా కాదా?"

అని ఒక్కఆసామీ యింకోఆసామీ నడిగ్గా—

'తమముఖం— పెదనాన్నకొడుకు వారసుడవుతాడుగానీ— పెద్దమ్మ కొడుకు వారసుడుగాడు. చిత్తగించగా?'

అని 'లా' తెలిసిన అవతలఆసామీ జవాబు చెప్పాడు.

"ఓహో! అప్పుండోయ్! పొరబాటు— గంగన్న మా పెదనాన్న గారి కొడుకేగానీ— పెద్దమ్మ కొడుకుగాదు— యిప్పుడు బాగా జ్ఞాపక ముంది..."

'ఆ స్థిని అప్పనంగా దొబ్బడానికి ప్లాను వేస్తున్నాడండోయ్ ఈయన—"

మరో మధ్యవర్తి అన్నాడు.

అక్కడికే యింకోకాయన వచ్చి—

గంగన్న తనకుటుంబ ఖర్చులనిమిత్తం, నాదగ్గర రెండువేల రూపాయిలు బదులుపుచ్చుకొని నోటురాశాడు. ముందు నానోటుబాకీ చెల్లుబడిగానిదే, కలక్టరుగారు యితరహక్కులెవరివీ విచారించరు' అన్నాడు.

'గంగన్నకు కుటుంబమే లేకపోతే, కుటుంబఖర్చులకు అప్పు లెప్పుడు చేశాడండీ?"

అని మరొకాయన ప్రశ్నించగా—

"నీకేం తెలుసునయ్యా! గంగన్న నాదగ్గర రెండువేలూ ఋణం చేసి నోటురాసినమాటనిజం. నోటుమీద సాక్షిసంతకాలుకూడా వున్నాయి.'

"ఇంత అక్రమానికి పాల్పడకూడదు—"

"ఛీ. ఛీ! నోరుముయ్యి నాది అక్రమమంటావ్! అంతనిజాయితీ గలవాడివిగాబట్టే చచ్చిపోయినగంగన్న పెద్దమ్మకొడుకనీ— పెదనాన్న కొడుకనీ వారసుడవు బయలుదేరావు."

'అబద్ధమా?'

'రేపు నేను కచ్చేరీకొచ్చిచెప్పనూ నువ్వుచెప్పేదంతా శుద్ధ అబద్ధమనీ—'

'నేనుమాత్రం చెప్పనూ, నీనోటువిషయం అంతకన్నా అబద్ధమనీ—'

'మనయిద్దరికీ యెందుకొచ్చిందీగొడవ—రాజీపడదాంరా!'

అని మొదటిఆసామీ రెండో ఆసామీని చెయ్యిపట్టుకొని దూరంగా తీసుకుపోయాడు.

రాజీయెలాగా—

'ఏమయ్యా! నువ్వు గారెల గంగన్నకు పెదనాన్నకొడుకు నేనని నేను నీతరఫున సాక్ష్యంచెబుతాను—నానోటువిషయం నిజమేననీ—నేను దానిని అక్రమంగా సృష్టించలేదనీ నాతరఫున సాక్ష్యమిచ్చి నాకు అసలీఫాయిదాలక్రింద మూడువేలు రావాలనిచెప్పు – ఆపయిన అంతా దైవాధీనం. కోర్టువారు నీకిప్పించేది నీకిప్పిస్తారు – నాకిప్పించేది నాకిప్పిస్తారు—''

'బాగుందయ్యా రాజీపద్ధతి—మనమిద్దరమూ పరస్పరసాయంతో లబ్ధిపొందుదాము.'

ఆయిద్దరూ ఒకనిశ్చయాని కొచ్చారు.

అదేసమయంలో ఆ దారంటపోతూపోతూ జానీ అక్కడఆగి –

'ఏమిటండీ యీగందరగోళమంతా?'

అని అడిగాడు.

"గారెల గంగన్న చనిపోతే—అతనితాలూకు అప్పువాళ్ళమనీ – వారసులమనీ చాలామంది బయలుదేరుతున్నారు. తలోపాపమూ తలో పిడికెడూ పంచుకోడానికి. మీకూడా ఏమయినా ఓపిక వుంటే ఊఁ!'

అని ఒక పెద్దమనిషి తనచేతిలోని పత్రికను జానీముఖంమీదకు విసిరి—

"దీనిని చదువుకుంటే—అంతా నీకే అర్థమవుతుంది—"అన్నాడు.

జానీ ఆపత్రికలోని ప్రకటనను సాంతంగా చదువుకుని—

"మంచి అవకాశం! దరిద్రంతో చచ్చిపోతున్నాను. గట్టిగా పేచీ పెడితే నాక్కూడా తృణమో—ఫణమో రాలకపోదు— ఏబాపతువారు సుదుగా పెడితే బాగుంటుందో ఆలోచించాలి.—"

అని తనలో అనుకొని జానీ పత్రికనయినా తిరిగిఈయకుండా పట్టుకుచక్కాపోయాడు.

పాడుదేవాలయం అరుగుమీద మరోకొంతమంది బుద్ధిమంతులు సభచేశారు.

"మనగ్రామవాస్తవ్యుడయిన గారెల గంగన్న చచ్చిపోతే — మనగ్రామంలోవుండుకున్న అతనితాలూకు ఆస్తినంతటినీ వశంచేసుకోడానికి గవర్నమెంటువారి కేటువంటి అధికారమున్నూ లేదు."

మనవూళ్లో—మనగంగన్నయొక్క ఆస్తిని మనమే అనుభవించాలి. ఇది నాయొక్క అభిప్రాయం.

అని ఒకబుద్ధిమంతుడు చెప్పగా మరియొక పెద్దమనిషి లేచి—

'తమయొక్క అభిప్రాయం చాలాచాలా బావుంది. అయితే ఆవిధంగా జరగడానికి మార్గమేమిటో తమరే శలవియ్యాలి.'

అని చెప్పాడు.

"స్వర్గస్తుడయిన గారెల గంగన్న యీపాడుదేవాలయంకింద నాలుగెకరాలు రాసియిచ్చినట్లుగా ఒకదస్తావేజు సృష్టిద్దాం"

"బాగుంది — మనవాదనప్రకారం నాలుగెకరాలూ వస్తాయి. అప్పుడేంచెయ్యాలి? ఆలయం బాగుచేయించాలి?"

అని మరియొకప్రశ్న.

"అబ్బెబ్బె! మనం అటువంటి తెలివితక్కువపనిని యెన్నడూ చేయకూడదు. తక్షణం ఆనాలుగెకరాలూ తెగనమ్మి—సదరుసొమ్మును యిక్కడ యిప్పుడు హాజరుగావున్నవాళ్ళంమాత్రం పంచుకుందాం!"

‘శభాష్! ఈయాలోచన బహుగొప్పగావుంది – బహుయోగ్యమై వుంది—’

అని అందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు.

‘మనం. యింకో వాదనకూడా లేవదీయొచ్చు. చనిపోయిన గారెల గంగన్నకు గారెలంటే చాలాయిష్టమునిన్నీ – తన అనంతరం గారెలసంతర్పణ చేయడంనిమిత్తం, అయిదు వేలరూపాయలు సేంక్షను చేసి మనలో ఒకరికి కాగితం వ్రాయిచ్చాడనిన్నీ చెబుదాం. అప్పుడా అయిదు వేలరూపాయలనూకూడా తిరిగి మనమందరమూ పంచుకో వచ్చు—”

అని యిలాగ్గా, ఆగ్రామంలోనివారనేకులు అనేకవిధాలగా మృతనష్టం ఆస్తిని పంచుకోడానికి ఆలోచనలు సాగించారు.

---

## ౨

‘ఏమోవ్! కొట్టేశా ఛాన్సు—’

అంటూ జానీ అతిసంతోషంతో యింటికి రాగానే—

“ఏం ఛాన్సు కొట్టారో ఏమో—నాకు తెలియదుగానీ—అద్దె కోసం యింటియజమానివచ్చి నానాహంగామా చేసిపోయాడు. ఇహ మీకీ జన్మలో ఉద్యోగం దొరకడం—ఏదిసంపాదించడము జరగదు గాబోలు!”

‘వుండవోయ్: వెధవవుద్యోగమో అని అఘోరిస్తావు—కొట్టేశాను పెద్దఛాన్సు—”

“ఇలాంటికబుర్లు చాలాసార్లు చెప్పారు. చంటికుర్రాడూ నేనూ యింట్లో మాడి చస్తున్నాము—”

“ఇహ చావనక్కర్లేదు లే!’

'ఏం చావక్కర్లేదో! చంటాడికి ఓ పుబ్బజారుగుడ్డ కుట్టిద్దామంటే చేతిలో కానిడబ్బు లేదు—నాపొంటిమీద మారుచీర లేదు—బువ్వ దొరకుతే బూరిముక్క దొరికినట్లుగావుంది—ఎంతకాలం అనుభవించ మీాదరిద్రం?"

'ఇహా అవసరం లేదన్నాగా?'

"ఎస్టేటుకలసిందా? లాటరీగెలుపొచ్చిందా? గంగాళం ధొరికిందా? ఎప్పుడు చెప్పినా ఇటువంటికబుర్లే చెప్తారు, చాల్లెద్దురూ!

"ఎస్టేటు కలియడంలాంటిదే_లాటరీగెలుపులాంటిదే! గంగాళం దొరకడంలాంటిదే!'

'ఊఁ! లాంటిదే!"

"నిజమే—'

'ఏమిటదీ?"

"ఈవూళ్లో గారెలగంగన్న అని ఒకఆసామీ వుండేవాడుట అయిదుసంవత్సరాలనగా కాశీవెళ్ళి చచ్చిపోయాడుట వాడికి వాడు సంతానంగాని, ఇతరవారసులుగాని యెవరూ లేకపోవడంవల్ల, అతని ఆస్తి సంతటనీ గవర్నమెంటువారు ఆధీనంచేసుకుంటూ, యెవరికిగాని, యెటువంటిహక్కులుగానీ వున్నట్లయితే తెలియపర్చుకోవలసిందని పేపర్లో ప్రకటించారు.'

'ఊఁ! ప్రకటిస్తే యేమిటి?'

"ఈవూళ్లో అనేకమంది అనేకకారణాలు కల్పించుకొని—అతని ఆస్తిమీాద హక్కులున్నాయంటూ బయలుదేరుతున్నారు.'

'ఇందులో మనకొచ్చే దేముందని.'

"విను—అంతా మనకొచ్చేటట్లు అద్భుతమైన ఆలోచన ఆలోచించాను."

"ఎల్లాగ?'

"నువ్వుకూడా కొంచం కలసిరావాలి. పాతిక వేలరూపాయల ఆస్తి, చిల్లిగవ్వయినా పయికి పోనీయకుండా అంతా మనదవుతుంది."

"ఎలాగండీ!'

"నువ్వు చిన్నఅబద్ధమొకటి ఆడాలి. వుత్తమాట—"

"చెప్పండి '

'రేపు కచ్చేరీలోకెళ్ళి, చనిపోయిన గారెలగంగన్నకు నువ్వు భార్యవనీ—మనకున్న కుర్రివాడు మీాయిద్దరికీ కలిగినవాడే గాబట్టి, ఆస్తికంతటికీ వాడే వారసుడనీ—కొంచం గట్టిగాచెప్పావంటే—పాతిక వేలరూపాయలఆస్తి సునాయాసంగా మనచేతుల్లో పడిపోతుంది—"

"అయ్యో ఆఘాయిత్రం బంగారంగానూ! యీావూళ్లోవాళ్ళందరూ అతనికి పెళ్ళాంబిడ్డలు లేరని చెప్పుకుటండీ!'

'ఏడిశాగు. అయిదేళ్ళనాడు వాడు కాశీపోయాడు—అక్కడ నిన్ను పెళ్ళిచేసుకున్నట్లు—ఈపిల్లాణ్ణి కన్నట్లు చెప్పుకోవాలి—"

'మనమిద్దరమూ భార్యాభర్తలమని, యీావూళ్లోవాళ్ళ కెవరికీ తెలీదూ?'

'మనం యీావూరొచ్చి వారంరోజులయినా కాలేదు. మనమిద్దరమూ మొగుడూపెళ్ళాలమో—అన్నాచెల్లెళ్ళమో యెవరికితెలుసు?'

"సరే అయితే—పాతికవేలొచ్చి పడతాయంటునారు— నేను మాత్రం కాదంటానా—ఒక్కమాటేగా? కానియ్యండి—సాహసేలక్ష్మి అన్నారు—'

'మీానాయనపేరు ఎవరురా అని అడిగితే మనవాడు తెలివితక్కువగా నాపేరు చెప్పేస్తాడేమో—కొంప మునుగుతుంది. గారెల గంగన్న అని చెప్పాలి.

"ఈలోపుగా మనం వాడికి పదిసార్లు పాఠంచెబుదాం లెండి.'

'ఏదీ పిలు చూాదాం!"

అని జానీ అనగానే ఆమె ఎక్కడో ఆడుకొంటున్న కొడుకును తీసుకొచ్చి—

'ఒరే! మీనాన్న పేరేమిట్రా?'

అని అడిగింది. ఆకుర్రాడు తడుముకోకుండా—

'మానాన్న పేరు జానీ—'

అన్నాడు.

'జానీకాదు బాబా! మీనాన్న పేరు గంగన్న అని చెప్పాలి—చెప్పు.'

"గంగన్న.'

'ఊఁ! అలాగ్గా' మళ్ళీచెప్పు—'

'గంగన్న.''

'గారెల గంగన్న అను.'

'గారెల గంగన్న.''

'చెబుతాడే—ఫరవాలేదు.''

'ఒరేయ్! బాబా! మీబాబుపేరేమిటని యెవరడిగినాసరే—గారెల గంగన్న అని చెబుతూవుండు.'

అని మొగుడూ పెళ్ళాలిద్దరూ, అయిదారేళ్ళ ప్రాయంలో వున్న తమబిడ్డకు గారెలగంగన్న పేరు చాలాకష్టపడి నేర్పించారు.

'ఈవూళ్ళో గారెలగంగన్న తాలూకు రెండు బ్రహ్మాండమయిన మేడలున్నాయిట! అవికూడా మనకేచెందుతాయి.

అని జానీ అనగా—అతనిభార్య తిలకం పట్టలేని సంతోషంతో—

'అలాగటండీ! యింకాచెప్పారుగాదేం? అయితే యిహామనకీ అద్దెకొంపలగొడవ తప్పిపోతుంది.'

ఒకమేడలో మనముండగా, యింకోమేడను ఓమ్యోభై రూపాయలకయినా అద్దెకిచ్చుకోవచ్చు.'

"ఇహానేమండీ! అప్పుడు మనంకూడా జమిందారుల్లో లెక్కపెట్టబడతాము—'

'అంతే—అంతే''

"దరిద్రబాధను అనుభవించగా అనుభవించగా మనకు గొప్ప ఛాన్సే తగిలింది—"

'ఇంకా విను — ఆమెకల్లో కావలసినన్ని వెండిబంగారాలున్నాయట.'

'అబ్బో అబ్బో! ఇంకేం?'

'నువ్వో గారెలగంగన్నకు భార్యవని చెబుతావు. చాలాభాగం ఆస్తి నొచ్చేస్తుందినీకు. నేనుకూడా ఏదయినా వంకపెట్టుకొని కోర్టు మహాజరయితే బాగుండేలావుంది."

'అవును—నాద్వారా కొంతఆస్తి — మీద్వారా కొంతఆస్తి, వస్తుంది. పైగా ఏమీపోకూడదు

"అయితే ఓపనిచేస్తాను ఆమేడలు రెండూ నాకు తనఖాపెట్టాడనీ—పది వలరూపాయిలు నేను ఋణమిచ్చానసీ—అందుచేత ఆమేడలు రెండూ నాకు చెందవలసి వుందనీ వాదిస్తాను—'

'బావుంది—అలా చెయ్యండి!'

అని భార్యాభర్తలిద్దరూ ప్లాను వేసుకున్నారు.

---

## 3

కలెక్టరుగారొకనాడు తమబంగాళాలో విశ్రాంతి తీసుకొంటున్న సమయంలో పరిచారకుడొచ్చి—

'తమదర్శనార్థం గారెలగంగన్న అనే ఆసామీ వచ్చాడండీ. తమతో ఏమో ముఖ్యవిషయాలు మనవిచేసుకోవాలంటున్నాడు."

అనిచెప్పగా కలెక్టరుగారాశ్చర్యపోయి—

"గారెలగంగన్నా! వాడు చచ్చిపోయాడుగా? సదరు ఆస్తిని. గవర్నమెంటువారు స్వాధీనం చేసుకోబోతున్నారు—చచ్చినవాడెలా బ్రతికివచ్చాడు చెప్మా!"

అని తమలో అనుకుని—

"సరే—వాడినిలోపల ప్రవేశపెట్టు—

అని కలెక్టరుగారనుమతించిన వెంటనే నౌఖరుపోయి ఒకఆసామీని తీసుకొచ్చి హాజరుపెట్టాడు.

సుమారు ఏభైసంవత్సరాలు వయసునుకలిగి, పెద్దగెడ్డము—మెడలో రుద్రాక్షమాలలుగల ఒక ఆజానుబాహువునుచూచి—

'నీవెవరవు? ఎందుకొచ్చావూ?'

అని ప్రశ్నించగా, అతడు అధికారికి నమస్కరించి—

"చిత్తం మహాప్రభో! నాపేరు గారెలగంగన్నఅండి—ఈవూరి కాపరస్థుడినే!"

అని సవినయంగా చెప్పాడు

"నువ్వు చనిపోయావని వార్త బయలుదేరిందే! పత్రికలో ప్రకటించాము కూడా."

'లేదు మహాప్రభో! నేను చచ్చిపోలేదండి— కిట్టనివాళ్లెవరో యీపుకార్ను వేశారు. నేనింతవరకూ కాశీలో వుంటున్నానండి—నేను చచ్చిపోయినాననీ—నాఆస్తియావత్తూ గవర్నమెంటువారు స్వాధీనం చేసుకుంటున్నారనీ—పత్రికలో ప్రకటించబడిన దానినిచూచి పరుగెత్తుకొచ్చానండి—'

"ఓ! అలాచెప్పు.'

"నేను గ్రామంలోకి వచ్చేటప్పటికి మహాఅల్లోకల్లోలంగా వుందండి—నాకు అప్పులమనీ— ఋణదాతలమనీ—అనేకమంది బయలు దేరారండి—వారందరూ తమకు హక్కులున్నాయని తమసన్నిధి

కొచ్చి, చెప్పుకుని. నామేడలూ—యీ భూములూ అన్నీ వశంచేసుకో-వాలని చూస్తున్నట్లుగా తెలుస్తూంది.'

'అవును—నాకూ కూడా అటువంటి పిటీషనులు చాలా దాఖలు చెయ్యబడ్డాయి. ఎల్లుండి విచారించి వారివారి హక్కులను నిర్ణయం చేయడానికి వాయిదా వేశాను.'

'అంతా దొంగముండాకొడుకులండోయ్ బాబోయ్! నాకు భార్యలేదు—బిడ్డలులేరు. ఇరుపార్వ్యాలా వారసుడన్నవాడు లేదు. రాగి పయిసాఅయినా ఋణంలేదు. నేనుచచ్చిపోయానని నిలవార వేసి నా ఆస్తినంతటనీ అప్పనంగా పడేసుకోవాలని చూస్తున్నారు.'

"చాలాగొప్పచిత్రమే జరుగుతూందన్నమాట — అయితే నీభూములూ, మేడలూ, అన్నివొదిలేసి కాశీయెందుకు లేచిపోయావు? నీఆస్తిపైవచ్చే ప్రతిఫలమునయినా నువ్వెందుకనుభవించడంలేదు?"

'నాకన్నింటిపయినాకూడా విరక్తికలిగిందిబాబయ్యా! ఆగొడవంతా చెప్పాలంటే చాలావుంది.'

'చెప్పు—చెప్పకపోతే వీలేదు. నేను నీవ్యవహారమునంతటినీ పూర్తిగా తెలుసుకోవలసివుంది. కూర్చో—స్థిమితంగాకూర్చుని అంతా చెప్పు.'

అని కలక్టరుగారు హెచ్చరించడంవల్ల గంగన్న తాపీగా కూర్చుని తనయావత్తువృత్తాంతమునూ యీవిధంగా చెప్పడం మొదలుపెట్టాడు—

"మాతండ్రిగారు వితంతువివాహం చేసుకున్నారు. నేనావితంతువుకూ, మానాన్నగారికీకలిగిన సంతానమును—

సాంఘికకట్టుబాటుల ననుసరించి, వితంతువివాహం నిషేధించబడడంవల్ల నేనుపుట్టకమునుపే, మానాయనగారికుటుంబమును వెలివేశారు.

నేనుపుట్టిన కొంతకాలానికి మాఅమ్మ స్వర్గస్తురాలయింది. నాకు క్రమంగా జ్ఞానమంకురించేసమయమది. మాఅమ్మ పోయేటప్పటికి నా కేనిమిదో యేడు.

మరీకు ర్రతనంగా దుగాబట్టి మానాన్నగారే నన్ను పెంచగలిగారు. భార్యపోయినతరువాత వారికి తిరిగివివాహం చేసుకోవాలన్న కాంక్షవుండేదిగాదు వయసుమళ్ళినవారు—వితంతువివాహమును చేసుకుని కులంచెడ్డవారు అయినకారణంవల్ల ఆయనకెవరూ పిల్లనీయలేదు—నిరాశచేసుకున్నారు.

నేను క్రమంగా పెరిగి పెద్దవాడను కావడంవల్ల, పరిస్థితుల నన్నింటినీ యెప్పటికప్పుడు తెలుసుకోగలిగేవాణ్ణి.

బంధువులుగాని, కులస్థులుగాని మాగుమ్మంలో కొక్కరూ వచ్చేవారుగారు—తమయిళ్ళకు మమ్మల్ని రానిచ్చేవారున్నాకారు.

అనుభవించడానికి యెంతఆస్తివున్నప్పటికీ — అనుభవించడానికి వసతులన్నీ వున్నప్పటికీ ఏకాకిజీవితమైపోయింది

పదిమందిలోకి వెళ్ళడానికి వీలులేకపోగా ఏరోడ్డంటయినా వెడుతుంటే—

వెధవపెళ్ళివెంకయ్యగారికొడుకుఅని, నన్ను వేలెట్టి చూపించి గుసగుస లాడేవారు.

నాకప్పుడు తలకొట్టేసినంత అభిమానం కలిగేది. అయినప్పటికీ చెయ్యగలిగే దేముందీ?

నాకుయుక్తవయస్సు రావడంవల్ల మానాన్నగారు నాకు వివాహం చేయడానికి ప్రయత్నాలు సాగించారు. కాని కులస్థులలో నాకు కన్య నీయడాని కెవరూ అంగీకరించలేదు.

మాగుమ్మంలోకి రావడానికే అంగీకరించనివారు — మమ్మల్ని సంఘంలో చీడపురుగుల్లా చూచేవారు—నాకుకన్యనిస్తారా?

అందువల్ల మానాన్నగారు నాక్కూడా వితంతువివాహమును చెయ్యడానికే నిశ్చయించారు.

మానాన్నగారికుటుంబం వెలికి గురియై, నానాబాధలూ పడడమును కళ్ళారాచూచిననేనుకూడా వితంతువివాహమునే చేసుకొని ఆబాధలు పడడానికి అంగీకరించలేదు.

'నాన్నగారూ నాకు వివాహంగాకపోతేపోయేగానీ – వితంతు వివాహంమాత్రం చేసుకోను. అజన్మాంతరమూ బ్రహ్మచారిగానయినా వుంటాను.' అని నేను దృఢనిశ్చయంతో చెప్పినమాటలకు మానాన్న గారు తిరుగాడలేదు.

కాని నాకు వివాహంకాలేదన్న జిజ్ఞాసవారికి ఎక్కువగావుండేది. వారాజిజ్ఞాసతోనే మరికొంతకాలానికి కాలధర్మమును పొందారు.

మానాన్నగారు చనిపోయేటప్పటికి నాకు పాతికేళ్ళకుపైగా వున్నాయి. పాతికవుప్పయ్యెకరాల పొలమును – రెండు పెద్దమేడలను – వెండిబంగారాలను – కొంతరొఖ్ఖ డబ్బును వారు నాకు సంపాదించి యిచ్చారు.

కాని ఒక్కప్రాణానికి ఏంగావాలి? కొంచమించుమించుగా మా నాన్నగారిచ్చినదంతా యీరోజువరకూ అలాగే నిలిచివుంది.

ఏకాకిజీవితం—యింతటిప్రపంచంలోనూ నాతో మాటలాడేవారు గానీ – నాకష్టసుఖాలకయినవారుగానీ ఒక్కరూ లేకపోయినారంటే ఆజీవితమెంతదుర్భరంగా వుంటుందో మీరే ఆలోచించండి.

నేను కంటికి కనుపించడంభయం – ఎవరిమట్టుకువారే – నన్ను గురించి ఏమేమో వింతగా చెప్పుకునేవారు – దూరదూరంగా తొలిగి పోయేవారు. నేనో చీడపురుగులాగో—అంతకంటే హీనంగానో కనుపించే వాడినందరకళ్ళకూను.

పుట్టినది బ్రతకడానికే – భగవంతుడు నిర్ణయించినంతకాలమూ జీవించడంకంటే వేరుకర్తవ్యమేమీ నాకు కనుపించలేదు—

నలభైయేళ్ళు దాటేవరకూకూడా వొంటెత్తుజీవితము నెల్లాగో గడపగలిగాను.

ఒకనాటిరాత్రి నాలోనాకే హఠాత్తుగా విరక్తితోచింది—ఈబ్రతుకుమీద—ఈప్రపంచంమీదా కూడాను.

దిక్కులేని మ్రోడున్నై నలభైసంవత్సరాలు గడిపాను—తండ్రిగారి స్వస్థలం—నేనుపుట్టిన గ్రామంఅన్నా అభిమానమును చంపుకోలేక యింతకాలమూ—యీగ్రామమును వొదిలిపెట్టకుండా యెల్లాగో కాలక్షేపం చేశాను.

కానీ జీవితానికి పరమావధి ఏమీ కనుపించలేదు.

నాకు మానాన్నగారు సంపాదించి యిచ్చినభూములు—మేడలు ఎవరనుభవించాలి?

ఈగ్రామంలో సంక్రమించినవాటిని యిక్కడేవొదిలేసి నేను తీర్థయాత్రలకుపోయి, నానాదేశాలూ కళ్ళతో చూచినట్లయితే కొంత ఆనందమయినా కలుగుతుంది.

ఇప్పటికే జీవితంలో మూడొంతులు గడిచిపోయింది. శేషించిన బ్రతుకును పుణ్యక్షేత్రాలు సేవించడంలో గడపడంమంచిది—

అని నామనస్సుకు తోచినతక్షణం కొంతడబ్బునుమాత్రం మూటగట్టుకుని ఎక్కడిభూములక్కడ, ఎక్కడిమేడలక్కడ—వొదిలేసి కాశీకి ప్రయాణమును సాగించాను

పోతూపోతూ ఎందుకయినామంచిదని, గ్రామకరణంతోమాత్రం చెప్పిపోయాను అయిదేళ్ళకు పైగాఅయింది—ఇంతవరకూ నేను పుణ్యక్షేత్రంలోనేవుంటూ—హఠాత్తుగా మీప్రకటననుచూచి పరుగెత్తుకొచ్చాను—"

అని గారెలగంగన్న చెప్పినదంతావిని కలక్టరుగారు దేనిని గురించో తీవ్రంగా ఆలోచించడం మొదలుపెట్టారు.

౪

'అంత విరక్తిమార్గము నవలంభించి, సర్వసంగపరిత్యాగంచేసిన వాడవు—ప్రకటనచూస్తిమాత్రం మళ్ళీ యెందుకొచ్చావూ?'

అని కల్యాణరావు ప్రశ్నించానికి గంగన్న తిరిగి యిలాచెప్పాడు—

"నాకు ఆ స్త్రీపోయినందుకు విచారంలేదండి—నాకెవరూ వారసులుగాని—ఆత్మీయులుగానీ లేరన్న చింతలేదు. నాఅనంతరం నాభాగ్యాన్ని అనుభవించడానికి భార్యాబిడ్డలు లేకపోయినందుకుకూడా విచారంలేదు

కాని నేను బ్రతికివుండగానే, నాఆస్తిని పంచుకోడాని కెవరో దుర్మార్గులు అక్రమంగా నీలివార్తను వేయుటము— ప్రభుత్వంవారు కూడా ఆవార్తనుసమ్మి నేను చనిపోయినట్లుగా పత్రికల్లో ప్రకటనలు చేయడము—నేను సహించుకోలేక పోయాను.

నేను చచ్చిపోలేదర్రోయ్, యింకా బ్రతికేవున్నానర్రోయ్, అని మొత్తుకోడానికి వచ్చానండి.వచ్చేటప్పటికి పాపాత్ములందరూ నాఆస్తిని తలోపిడికెడూ పంచుకోడాని కున్నాకుట్రలెయున్నారని తెలుసుకుని, మీతో మొరపెట్టుకుందామని వచ్చాను.'

'మంచిది—నువ్వుచేసినది చాలా తెలివిగలపని—నిన్ను గ్రామంలో యెవరూ గుర్తుపట్టలేదా?"

'లేదండి—నన్నెవరూ గుర్తుపట్టలేరు—అయిదేళ్ళయిపోయింది నారూపంలో చాలాభాగం మారిపోయివుంది."

"అయితే ఓపనిచెయ్యి—ఎల్లుండి విచారణకు వాయిదా వేశాను గదా! అందరూవచ్చి తమతమహక్కులను తెలుపుకుంటారు. అప్పుడు

నువ్వేమీ మొగమాటపడకు నాపక్కనే కూర్చో—ఎవరెవరేం చెబుతారో విని—తగినట్లుగా బుద్ధిచెప్పొచ్చు—ఇప్పుడు మనమిద్దరమూ ఏకమై ఓచిన్ననాటకము నాడొచ్చు—'

'చిత్తం బాబయ్యా! తమశెలవుప్రకారం చేస్తానండి—

'నువ్వు బ్రతికేవున్నావనీ—తిరిగివచ్చావనీ తెలిసినట్లయితే—' ఎవరూ కచ్చేరీకి రారు—అందుచేత. నువ్వుతిరిగి గ్రామంలోకి వెళ్ళకుండా ఎల్లుండి కచ్చేరీవేళవరకూ నాబంగాళాలోనే వుండిపో! నీకేమీ లోటుండదు.''

'అధికారులు యింతదయగా చెబుతుంటే, నేనుదేనికీ కాదననండి—'

'అయితే నువ్వింతకాలమూ వివాహం చేసుకోకుండా బ్రహ్మచారివిగానే గడిపావన్నమాట?'

'అందుకేమీ సందేహంలేదండి.'

"వివాహం చేసుకోవాలనీ—సంసారసౌఖ్యాలు అనుభవించాలనీ—నీకు కోరికలు లేవటయ్యా?'

'ఉంటేమాత్రం ఎలాసాగుతాయండీ?''

"పాపం! నిష్కారణంగా జీవితమునంతటినీ వ్యర్థంచేసుకున్నావు మీనాన్నగారి కోరికప్రకారం సితంతువునయినా వివాహంచేసుకొని సంసారసౌఖ్యాల ననుభవించవలసింది.'

'ఇప్పుడు నేనూ అలాగే అనుకుంటున్నానండి—కాని యేం లాభం? వయసులో పెంకితనంగా ప్రవర్తించినందుకా ఫలితాన్ని యిప్పుడనుభవిస్తున్నాను.'

అని గంగన్న చెప్పినదానికి కలక్టరుగారు తమలోతాము నవ్వుకుంటూ—

"పోని యిప్పుడేమయినా ప్రయత్నంచేయరాదూ?''

అని అడిగారు.

“దేనికిబాబయ్యా ప్రయత్నం?’

“పెళ్ళికి—”

“ఆఁ! ఇప్పుడు నాకెవరిస్తారండీ పిల్లనీ?

అని చెప్పిన గంగన్నయొక్క తత్వం తెలిసిపోయింది. కలక్టరుగారికి అంతటినుంచీ ఆయన గంగన్నను ఒక ఆటవస్తువుగా వుపయోగించుకోవడం మొదలుపెట్టాడు వినోదార్థము ఇష్టకాలక్షేపం చెయ్యడం మొదలుపెట్టాడు.

“నీకు పిల్లనియ్యడానికేమయ్యా? కావలసినంత ఆస్తివుంది— నువ్వయినా పూర్తిగా ముసలివాడవై పోలేదుగా?’

“అయిపో లేదంటారా?”

కలక్టరుగారు తమనవ్వును తమలోనే అణుచుకుంటూ—

“అబ్బే! లేదయ్యా! నువ్వింకా పూర్తిగా ముసలివాడవు కాలేదు—’

‘తమరు కలక్టరుగారయివుండిన్నీ, అధికారులయి వుండిన్నీ, రవ్వంతయినా గర్వంలేకుండా, నాబాగునుగోరి యిటువంటి చక్కని సలహాలు చెబుతున్నారండీ!’

అని, కలక్టరుగారు తన్ను పరిహాసం చేస్తున్నారని తెలుసుకోలేక, గంగన్న అపరిమితమయిన ఆనందము ననుభవించడం మొదలుపెట్టాడు.

‘అయితే, బాబయ్యా! నాఆస్తంతా నాకు మళ్ళీ వచ్చేస్తుందంటారా?

“ఎందుకు రాదోయ్! గ్రామస్థులందరూ ఏకమై, నీవు చచ్చిపోయావని నీలివార్తను పుట్టించి, అందరూ తలో కాస్త అక్రమలాభమును పొందాలని చూస్తూన్నారంతేగాని, నువ్వు నిజంగా యెవరికీ బాకీ లేవు—నీకు వారసులు కూడా యెవరూ లేరు.’

‘లేరండి బాబూ! లేరండి! ఏ దొంగ వెధవలున్నా, లేనివారసత్వమును కల్పించుకొని ముందుకొచ్చినప్పటికీ, నేను బ్రతికివుండగా యెలాసాగుతుందండీ!’

“సాగదు — నీ ఆస్తికి ఎటువంటి భయమూ లేదోయ్! నువ్వు చక్కగా వివాహంచేసుకుని సుఖపడవలసిందని నాకోరిక ”

“ఏలినవారి అనుగ్రహముంటే అదెంతసేపుబాబయ్యా? కాశీ రామేశ్వరాలు లేచిపోయి, మాయిబ్బందులుపడ్డాలెండీ— కాస్తంత కాళ్ళ మీద చెయ్యేసేదిక్కు లేదుగదా అండి—పట్టెడన్నంవొండి విస్తట్లో పెట్టే భార్య లేనప్పుడు ఎంత ఆస్తివుంటే ఏంలాభం చెప్పండీ!”

“అవునవును—అందుకే యిప్పుడయినా వివాహంచేసుకోవలసిందని చెబుతున్నాను.”

“కాదంటే కాస్తంత ముదరవయస్సు.”

“నీకు ఏభైకంటే యెక్కువయేళ్ళున్నాయా?”

‘లేవండి— లేవు’

“మరియిహోనేం. ఏభైసంవత్సరాలు ఒకవయస్సేగాదు. భగవంతుడిచ్చిన నూటేళ్ళవయస్సులోనూ సగమయిందనుకున్నప్పటికీ, అనుభవించాలంటే యింకా సగముంది. ఏమంటావ్?’

‘చిత్తం. వుందండి — అన్నీ తెలిసిన మారాజులుగాబట్టి చెబుతున్నారు. ఇంతకాలమయింది—నాకీమాత్రం సలహాయిచ్చిన బుద్ధిమంతులే కనుపించలేదుసుమండీ!’

'రేపు కచ్చేరీలో హక్కుదారులందర్నీ విచారించి, నీమేడలు, నీభూములు అన్యాక్రాంతాపోకుండా నిలబెడతాను. అన్యాక్రాంతమయిపోయిన వెంటనే—ఏదో పిల్లనుచూచి ముడిపెట్టుకో!''

'తమరు నాబాగుగోరి యిన్నివిధాల చెబుతున్నప్పుడు మానేస్తానా బాబయ్యా!''

అని గారెలగంగన్న గొట్టలు మింగుతుండగా—

'వెర్రిముండాకొడుకు—ప్రపంచజ్ఞానం లేనివాడుగాబోలు — కనుకనే సమస్తమూ హారతి కాసీ లేచిపోయాడు — గ్రామస్థులు వీడుచచ్చాడని నీలివార్తను పుట్టించి ఆ స్థితిపడేసుకోవాలని చూస్తున్నారు.'

అని కలెక్టరుగారు తమలో అనుకొని నవ్వుకున్నారు.

---

## 7

ఆవేళ కలక్టరుగారికచ్చేరీ, యిసకవేస్తే రాలనంతజనసమర్దంతో వుంది.

నియమితకాలంలో కలక్టరుగారు ఉచితస్థానము నలంకరించారు. వారితోపాటే మరియొకవ్యక్తి, కోటు తలపాగా మొదలయినవేషంతో వచ్చి అధికారుల సరసనే మరియొకకుర్చీలో కూర్చున్నాడు.

అతనెవరో కొత్తఉద్యోగియైవుంటాడని అందరూఅనుకున్నారు.

కచ్చేరీ ప్రారంభించబడిన అనతికాలంలోనే—

'గారెలగంగన్న పిటీషనుదారుల్లు!'

అని కలక్టరుగారు కేక వేయించారు

అర్జీదారులు ఒక్కొక్కరుగా అధికారి యెదుటికొచ్చి నిలుచున్నారు.

కలక్టరుగారు వారి వారి అర్జీలన్నీ అందుకుని వరుసగా ఒక్కొక్కరిని విచారించడం మొదలుపెట్టారు

"ఏమయ్యా! గారెలగంగన్న ఆస్తిపై నీకెటువంటి అధికారముందీ అతనికీ నీకూ ఏమిటీ సంబంధం?"

అని కలక్టరుగారడగ్గా—ఆ అర్జీదారు కంటతడి పెట్టుకుంటూ —

'పట్టలేని దుఃఖంతో వున్నాను—ఏం చెప్పాలోను బాబయ్యా! అదృష్టవంతుడు—వాడికి రోజులయిపోయినాయి వెళ్ళిపోయాడండి. గారెల గంగన్న అంటే నాకు స్వయానా పెదనాన్న కొడుకండి—వాడి కుటుంబానికంతటికీ నేను తప్ప, యింకెవరూ వారసులు లేరండి—"

అని జంకకుండా చెప్పేటప్పటికి, కలక్టరుగారూ—వారి ప్రక్కనే మారువేషంతో కూర్చున్న గంగన్న కూడా తెల్లబోయాడు.

'అలాగటోయ్, గారెలగంగన్న నీకు పెదనాన్న కొడుకా? అతనిలా వుండేవాడూ?'

అని కలక్టరుగారడిగినదానికి అర్జీదారు కొంచమాలోచించి —

"అప్పుడే చావు పీనుగులా వుండేవాడు బాబయ్యా! వాడెలాగా బ్రతకడు—వాడి ఆస్తి అంతా మాకు చెందవలసిందేనని, మేము ఆదిలోనే లెక్కేసుకున్నామండి'. అని చెప్పాడు.

"మంచిది. గంగన్నకిప్పుడేమాత్రం వయస్సుంటుందీ?"

'వయసు చిన్నదేనండి—పాతికకంటే ఎక్కువవుండవు — కాని దేహాకాయిలావల్ల చచ్చిపోయాడండి. అప్పుడు నేను దగ్గరే వున్నాను — చచ్చిపోతూ—'నా ఆస్తి అంతటినీ నువ్వే అనుభవించరా బాబాయ్! దొంగ

వేషాలు వేసుకుని అనేకమంది వస్తారు. వాళ్ళకు దక్కనియ్యకు— అని కూడా చెప్పాడండి.

అని ఒకటవఅర్జీదారు చెప్పినదానినంతటినీ విని—

'హారి వీడిదుంపతెగా! ఎలా నీలు పండిస్తున్నాడో! నేను చచ్చి పోయేటప్పుడు వీడుదగ్గరవున్నాడుట—నాకు పినతండ్రి, పినతల్లుడు లెవరూ లేనిదే వీడెక్కడనుంచి వచ్చాడూ? దాయిణాం!''

అని తనలోఅనుకొని, గంగన్న నిర్ఘాంతపోయిచూడడం మొదలు పెట్టాడు

'సరే—నువ్వు అవతలగా నిలుచో—'

అని కలక్టరుగారు రెండో అర్జీదారును పిలచారు.

'గారెలగంగన్న తనకుటుంబఖర్చుల నిమిత్తం, తన రెండుమేడ లనూ పదివేలరూపాయిలకునాకు తనఖా రాశాడండి దస్తావేజును రిజిస్టరీ చేయించాలనుకుంటూనే చనిపోయాడు. మొట్టమొదట నాకుబాకీ చెల్లుబడిలేనిదే, కోర్టువారు ఇతరహక్కులను విచారించడం ధర్మం గాదండి—'

అని రెండవఅర్జీదారుచెప్పి ముగించగా—

'ఇదిమరీ సరసంగావుంది. నాకు కుటుంబమే లేనిదే-దానిఖర్చు లకు పదివేలు అప్పుచేశానా! కాగా, అప్పుచెయ్యడానికి నాఖర్మమేం గాలింది? ఈనిమిషంలో ఇనప్పెట్టె తెరిచాసంటే, పాతిక వేలున్నాయి, సరేకానియ్యి— ఇంకాఎంతమంది ఏవిధంగా చెబుతారో!'

అని గంగన్న తనలోఅనుకుని, మూడవఅర్జీదారు చెబుతున్న దానిని వింటున్నాడు.

'గంగన్న నాకు ఆప్తమిత్రుడండి—అతనికి గారెలంటే బహు యిష్టమవటంవల్ల, తనఅనంతరం గారెలసమారాధన చేయవలసిందని తన ఆస్తిమీద అయిదువేలు నాకు సంక్రమించేలా, కాగితంరాసి

యిచ్చాడు. స్వర్గంలోవున్న గారెలగంగన్న ఆత్మశాంతికోసం గారెల సమారాధనవిధిగాచేయించాలి. అందుకునాకో ఐదువేలురానియ్యండి'

ఆ అర్జీదారు చెప్పినదానిని వినేటప్పటికి, గారెలగంగన్నకూ—కలక్టరుగారికికూడా నవ్వాగిందిగాదు.

'నాకోట్టులో మూడువేలు బట్టలవాడకం బాపతుబాకీవుంది, గుటుక్కున చచ్చాడండా మారాజు—'

అని మరియొక అర్జీదారు.

'విచ్చాలబాపతు ఆరొందలుపద్దువుంది. మారాజా!'

అని యింకొక అర్జీదారు

'గ్రామంలోని పాడుదేవాలయం మరమ్మత్తులకింద రెండువేలు రాశారండి—భగవంతుడి కార్యం—ఇందులో మేము తినేదేమీ లేదు—'

అని వేరొక అర్జీదారు—

ఇలాగ్గా అనేకమంది అర్జీదారులు చెప్పుకొన్న అనంతరం, జానీ ఒక స్త్రీని వెంటబెట్టుకొచ్చాడు.

ఆ స్త్రీ నెత్తిమీద ముసుగువేసుకుని వలవల యేడుస్తూ కోర్టువారియెదుట నిలుచుంది. ఆమెచంకలో ఒక అయిదేళ్ళకుర్రాడు.

'నీవ్యవహారమేమిటి?'

అని కలక్టరుగారడగ్గా, ఆ స్త్రీతరఫున జానీ ఏమో చెప్పబోగా—

"ఆమెను స్వయంగా మాటలాడనీయవయ్యా"

అని కలక్టరు చెప్పినమీదట ఆ స్త్రీ కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ—నోటికి గుడ్డ అడ్డంపెట్టుకొని దుఃఖమును అభినయిస్తూ—

'నా పెనిమిటి సంపాదించిపెట్టిన ఆస్తిని అక్రమంగా పంచుకోడానికి ఎంతమంది హక్కుదారులు బయలుదేరారో చూడండి. మారాజా! నాభర్తకెవరూ ఋణదాతలులేరండి! నేనూ నాబిడ్డాతప్ప యింకెవరూ వారసులు లేరండి.'

అని చెప్పగా, కలెక్టరుగారొక వయిపున, గంగన్న యింకో వయిపునా నిలువునా నీరయిపోయారు.

“ఏమిటీ? నువ్వు నా— కాదు గంగన్న పెళ్లానివా? ఛీఛీ బావుంది—”

అని గంగన్న నోరు తెల్లబెట్టాడు.

‘నువ్వు గాలెంగంగన్న భార్యవుటమ్మా! చంకలోనివాడు గంగన్న కొడుకా! అతనికి భార్యాబిడ్డలుండగానే యింతమంది హక్కుదారులు బయలుదేరారా?’ అని కలెక్టరుగారడగ్గా—

‘చిత్తంబాబయ్యా! చాలాఅన్యాయం. గంగన్నగారికి భార్యాబిడ్డలమయిన మేముండగా ఆ స్త్రీలు యెలా పొందడానికి వల్లగాదండి—”

అని తిలకం, అక్కడినుంచీ తిరిగి యేడుపును ప్రారంభించింది. జానీ ఆమెను సౌంజ్ఞచేశాడు.

“అయ్యోనా దేవుడో! అయ్యో దేవుడా! మమ్మల్ని అధ్వాన్నంలో కలిపి వెళ్ళిపోయావా! నీకొడుకు పెళ్ళిపేరంటాలు—ముద్దుముచ్చటలు చూచుకొనే యోగం నీకు లేకపోయిందా! అయ్యో నా దేముడో అయ్యో నా దేముడా! నాపసుపు కుంకాల కేకరువు చేశావా?’

ఆమె యేడుపును విని అక్కడివారందరూ తెల్లబోవడం మొదలు పెట్టారు ఆమెనిజంగా గాలెంగంగన్న భార్యఅయి వుంటుందనీ—అందర నోట్లోనూ కరక్కాయపడిందనీ అనుకున్నారు.

‘అయితేనూ! గాలెంగంగన్నను నువ్వు యెప్పుడు వివాహం చేసుకున్నావమ్మా! ఎంతకాలం కాపురంచేశావు?’

అని కలెక్టరుగారడగ్గా—

‘కాశీలో అయిదేళ్ళక్రితం వారునన్ను వివాహం చేసుకున్నారండి. ఆవెంటనే పుత్రసంతానం కలిగింది. అప్పటినుంచీ నేనుకూడా కాశీలోనే వుంటున్నాను,’

“ఆయనపోయి యెంతకాలమయిందీ?’

‘మీరుపేపర్లో ప్రకటించినప్పుడే పోయారండి!”

‘నీభర్త అవసానకాలంలో నువ్వుదగ్గరే వున్నావన్నమాట?’

‘లేకేమండీ! రాత్రింబగళ్ళు నిద్రాహారాలు లేకుండా సేవలుచేసుకున్నాను. వారు బ్రతుకుతారేమోనని ఎంతయినా కష్టపడ్డాను—కాని భగవంతుడు దయలేకుండా నాదేవుణ్ణి యెత్తుకుపోయాడు.’

అని జానీ అంతకుముందు చెప్పినప్రకారం, తిలకం తనపాత్రను తాను అతిచాకచక్యంగా నటిస్తుంటే గంగన్నతాలూకు యావత్తుఆస్తినీ తమకే సంక్రమిస్తుందని, తనలోతాను అపరిమితమయిన ఆనందము ననుభవిస్తూ—

‘బాబయ్యా! గారెలగంగన్నతాలూకు మేడలురెండున్నా నాకు పదివేలకు తనఖావున్నయండి—కాగితాలు దాఖలుచేసుకుంటాను.’

అని చెప్పాడు.

‘నీపేరు—’

‘జానీ—’

“ఇంతకుముందొక తనఖాదారున్నాడు.’

‘నాది ముందుతనఖాలెండి.’

‘సరే—చూస్తాం’

“అన్నిటికంటే యీమె యెవరో నాభార్యనని చెప్పుకుంటూ రావడం బాగుంది. మనిషి సదరుగానేవుంది—పనికొస్తుంది. ఇదెందుకొచ్చిందో—కానియ్యి—పెళ్ళాంలేక చచ్చిపోతున్నాను—ఈమెను నా భార్యక్రింద స్వీకరిస్తా—”

అని గంగన్న తనలో అనుకుంటూవుండగా, కలక్టరుగారు తమ స్థానమునుదిగి, స్త్రీ చంకలోవున్న బిడ్డనుతాకి—

"మీనాయన పేరేమిటి బాబూ' అని అడిగాడు.

"జానీ—

అని ఆకుర్రాడు, తనపాఠాలన్నీ మరచిపోయి తటాలున యదార్థముసు చెప్పాడు.

'తప్పులు! గారెలగంగన్న అని చెప్పు—"

అని తల్లి హెచ్చరించింది కాని, కలక్టరుగారా బాలుణ్ణి మరి ఏమీ అడగలేదు

"కుర్రతనంబాబయ్యా! తెలీదు—ఏదో నోటికొచ్చినపేరు చెప్పేశాడు"

అని తిలకం చెప్పింది.

"నువ్వు గంగన్నభార్యవని ఋక్కడున్నవారెవరేనా సాక్ష్యం చెప్పగలరా."

అని కలక్టరుగా రడగడమే తడవుగా—

"చిత్తం—నేనున్నానండి —ఈఅమ్మాయి—గారెలగంగన్నకు భార్యఅయిన విషయం నేనెరుగుదును—అతని ఆస్తి యావత్తుకూ యీామెయే వారసురాలయినమాట యదార్థమనిప్రమాణపూర్వకంగా చెబుతున్నాను.'

అని జానీ జంకులేకుండా చెప్పినదానినికూడా కలక్టరుగారు విన్నారు.

చేరువలోనే కూర్చున్న గంగన్నకు కనుసౌజ్ఞచేసి, రహస్యాలోచనామందిరంలోకి తీసుకెళ్ళారు.

"ఏమయ్యో! ఏమంటావ్! నీరొట్టె నేతిలోపడింది—ఆమెనీకు నచ్చితేచెప్పు. భార్యలేనిలోటు తీర్చుకుందువుగాని—"

అని కలక్టరుగారు చెప్పగా—

'చిత్తం బాబయ్యా! తమ అనుగ్రహం'

'ఆమనిషి నీకు నచ్చిందా?"

'నచ్చకేమండీ? బంగారం బొమ్మలావుంది కష్టపడి కననక్కర లేకుండా కొడుకుకూడా వున్నాడు.'

"మరయితే, నీవేషమంతా తీసేసి—మామూలుగారా!'

అని కలక్టరుగారు చెప్పిన వెంటనే, గంగన్న తనకోటు, తలపాగా వగైరా వేషమంతటినీ తీసివేసి, కలక్టరుగారితో యివతల కొచ్చాడు.

గంగన్నను చూచేటప్పటికి కొత్తన్న అంతకుముందు తెలిసిన వాళ్ళందరూ నిలువునా నీరయిపోయారు. చనిపోయాడనుకున్నవాడు కళ్ళయెదుట సాక్షాత్కారమయితే మేమనుకోవాలి?

ఎవరిమట్టుకువారు చల్లగా జారిపోవాలనిచూచారు. కాని ఒక పిట్టయినా అవతలకు వెళ్లకూడదని, కలక్టరుగారు చుట్టూపహరా వుంచారు.

'చచ్చిపోయినారంటే, గామోసువనుకున్నాము — మళ్ళీ బ్రతికి వచ్చారాబాబయ్యా!'

అని ఒకరు—

'ఎన్నాళ్ళయిందిమారాజా! కళ్ళు కాయలు కాసిపోయాయి.'

అని మరియొకరు—

'దుర్మార్గులెవరో మీరుచచ్చిపోయారని సీలివార్త వేశారు. ఎంతఘోరంబాబయ్యా! చిరకాలానికి మళ్ళీస్వగ్రామం చేరుకున్నారు— మాకందరకూ చాలాచాలా సంతోషంగావుంది.'

అని యింకొకరు—

ఇలాగ్గా, అక్కడమూగినవారందరూ అపరిమితమయిన ప్రేమ గౌరవాలను నటిస్తూ, గంగన్నను ఆప్యాయంగా పరామర్శించడం మొదలుపెట్టారు.

"మీపరామర్శలన్నీ నాకు తెలుసుగానీ—ఇప్పుడు ముందుకొచ్చి చెప్పండి—నేను యెవరెవరికి ఏమేంబాకీవున్నాను—ఎవరెవరికి తాకట్లు తనఖాలూ పెట్టాను."

అని గంగన్న అడగ్గా—

'లేదుబాబయ్యా! మీ రెవరికీ ఒక్కరాగివయినా ఈయవలసిన అవసరంలేదు—మీ రెవరికీ ఏవిధంగానూ బాకీలేరు. కాని తమఆస్తి యావత్తున్నూ గవర్నమెంటువారికి సంక్రమించిపోతూవుంటేచూచి సహించలేక అందరమూ తలోకాస్తాపంచుకుందామన్నా సద్భావంతో యిలా చేశాముగాని—అంతకీ వేరేకారణమేమీ లేదండి! కోర్టువారూ మీరూకూడా మమ్మల్ని క్షమించాలి.'

అని అందరూ ఏకగ్రీవంగా చెప్పారు.

జానీ తిలకము లిద్దరూ ప్రశ్నార్థకంగా ఒకరిముఖాల్లోకొకరు చూచుకోవడం మొదలుపెట్టారు.

"ఇంకెందుకమ్మా గొడవ — నీభర్తతో నీవువెళ్ళిపోవచ్చు — మీరిద్దరూ సుఖంగా సంసారంచేసుకోండి"

అని కలక్టరుగారనగా తిలకం ఖిన్నురాలై తలను క్రిందికి దించుకుంది.

"నువ్వుచెప్పిందాంట్లో అసత్యమేమన్నా వుంటేచెప్పు — శిక్ష విధిస్తాను"

అని కలక్టరుగారు తిరిగి అనేటప్పటికి తిలకం మరింత బెదిరిపోయింది.

'లేదండి—నేనుచెప్పినదాంట్లో అసత్యంలేదు—'

అని ఆమెచెప్ప లేక చెప్పింది.

"వెళ్ళవయ్యా! నీభార్యనూ, బిడ్డనూ తీసుకునివెళ్ళు—మీసుఖజీవనానికి ఏదుర్మార్గులయినా ఆటంకమును కలిగించారంటే నేనువారిని శిక్షించగలను."

అని అధికారి తిరిగిచెప్పినమీదట — గంగన్న తిలకంచెయ్యి పట్టుకొని—

'ఊఁ—రా! వెళ్ళిపోదాం—

అని తీసుకుపోతూవుంటే — ఆమె విధిలేక అతనితో వెళ్ళిపోతూంది. జానీ బిక్కముఖం వేసుకుని చూడడం మొదలుపెట్టాడు.

'ఇది పంచమహాపాతకపట్నమయినందు కూరికేపోలేదు — నాభార్యనుచూస్తుండగా యింకొకరికి అంటగట్టా డీఅధికారి. ఇప్పుడేమిటీ చెయ్యడం? నోరెత్తానంటే ఖయిదులోకి తోస్తాడు.

కానియ్యి—ఎక్కడికిపోతుంది? నాలుగురోజులు అతనితోవున్నట్లే వుండి లోడ్డూలోసుగూ మాటగట్టుకుని నాభార్య నాకెలాగా వస్తుంది—'

అని అతడు తనలోఅనుకొని అప్పటికి సరిపెట్టుకోగా తిలకం కూడా సౌంజ్ఞచేసి అతనికి అదేవిధంగా సూచించింది.

గారెలగంగన్న తిలకమునూభార్యను వెంటబెట్టుకుని తనయింటికి తీసుకుపోయాడు.

ఆమేడయొక్క సౌభాగ్యసంపదలను — సాధనసామగ్రినీచూచి తిలకం ఎంతయినా అబ్బురపడింది. కాని తనభర్త యింకొకడై వుండగా యితనితో వచ్చేసినందుకు మొదట కొంచం కించపడింది. కాని అప్రయత్నంగా అయాచితంగా తానటువంటి సౌభాగ్యసంపదలకు యజమానురాలవుతే, ఆపదవి నెలాపోగొట్టుకుంటుంది?

గంగన్న ఆనాడే తిలకానికి లెక్కలేనన్ని విలువగలచీరలు — బంగారుఆభరణాలూ యిచ్చాడు వాటినన్నింటినీధరించి, ఆమేడలో మసులుతూవుంటే ఆమెకదంతా ఓపునర్జన్మలావుంది

కాని—జానీవిషయం తల్చుకున్నప్పుడల్లా ఆమెకు గుండెగుభేలుమంటూంది.

నాలుగురోజులు గడిచాక —

'అయితేనూ, నీనిజవృత్తాంతమేమిటో యిప్పుడయినా చెప్పరాదు — కేవలం డబ్బుకోసం మోజుపడి, నాకుభార్యగా వచ్చావని నాకు తెలుసు—'

అని గంగన్న అడగ్గా—

'ఆవిషయాలేమీ మీరు నన్నడగొద్దు — మీకు భార్యగా వచ్చాను—అలాగే వుంటాను.'

అని ఆమె ఒకేసారి ఖచ్చితంగా అడగడంవల్ల గంగన్న ఆమెను తిరిగి యింకేమీ అడగడంమానేశాడు.

'ఏది ఏమయితే నాకెందుకూ? ఏభైసంవత్సరాలు భార్యలే కుండా బ్రహ్మచర్యంలో గడిపాను—నానాఅవస్థలూ పడ్డాను. ఈనాటికి నాభార్యఅంటూ ఒక స్త్రీ నాయింట్లోవుంటూంది. నాకిదేవదివేలు.

నేను చనిపోయానని పుట్టించబడిన నీలివార్తవల్ల నాకు మహోపకారమే జరిగింది. అందుకు కలక్టరుగారుకూడా గొప్పఉపకారం చేశారు.

అంతకుముందు నాముక్కూ—ముఖమూయెరుగక పోయినప్పటికీ నాకు భార్యలాగేవుంటూ—దాంపత్యసౌఖ్యము నిస్తూంది. ఆమె మనసులో యేముందో యెవరికితెలుసు? తెలియకపోతే నాకు చెడిపోయిందేముందీ''

గ్రామస్థులందరూ వింతవింతలుగా చెప్పుకొంటున్నారుట! ఎవ్వడలాచెప్పుకొంటే, నాకుపోయిందేముందీ? నాఆస్తినాకు నిలబడడమే గాకుండా బంగారింలాంటి భార్యకూడా దక్కింది.

నేని చనిపోయానని పుట్టించబడిన నీలివార్తవల్ల యింతలాభం కలిగింది.''

అని గారెలగంగన్న తనలోతాను సంతోషమునే పొందుతున్నాడు.

''ఊరివారి పెళ్ళాన్నెవరోతీసుకొచ్చి యింట్లో పెట్టుకుని మురిసిపోతున్నా వేమిటయ్యా.'

అని ఒకరు—

''స్వంతభార్యవుండాలిగానీ—యిదేమిటీ? రెండోరకం—''

అని మరియొకరు—

ఈవిధంగా అనేకమంది అనేకరీతులుగా గంగన్న ముఖంమీదనే అనడం మొదలుపెట్టారు.

కానీ గంగన్న ఆమాటలు తన్నుకానట్లు దులిపేసుకుని సంచరించడం మొదలుపెట్టాడు.

తిలకం తనలోతానేమేమో ప్లానులు వేసుకుంటుంది, కాని గంగన్నకవేమీ తెలియనే తెలియవయ్యె!

౭

"ఇప్పుడింట్లో లేడుగదా!"

'లేడు—లేడు—త్వరగా లోపలికొచ్చెయ్య—'

అని జానీ లోపలకు రాగానే, తలుపులు వేసిందితిలకం.

తండ్రినిచూడగానే చంకకెక్కాడు కుర్రాడు.

'గొప్పచిక్కులోపడ్డాం. ఇన్నిరోజులనుంచి ప్రయత్నంచేస్తుంటే, యిప్పటికి లోపలప్రవేశించడానికి వీలయింది.'

"ఆగంగన్న యెప్పుడూ యింట్లోనేవుంటాడు. ఇప్పటికినామీద కొంచం నమ్మకంచిక్కడంవల్ల, యిల్లంతా నామీద వొదిలివెళ్ళి పోయాడు."

'ఎక్కడికి పోయాడూ?'

"ఏదో అవసరమయిన పనివుంది—ఈదగ్గరలోనేవున్న పొరుగూరువెళ్ళాడు.'

'అయితే కొంచంస్థిమితంగానే వుండొచ్చు."

'ఆ, వుండొచ్చు సాయంకాలందాకారాడు. మేడమీదికి పోదాంరాండి'

అనిచెప్పి, తిలకం భర్తనుమేడమీదికి తీసుకుపోయి అక్కడుండే విలువగల సామానులూ—వెండిబంగారాలూ అన్నింటినీ చూపింది.

కొన్ని ఆభరణాలను—కొంతరొక్కమునూ ఓ పెద్దమూటగాకట్టి భర్తకిచ్చి—

"వెళ్ళేటప్పుడు యీమూటను తీసుకుపోయి మనయింటిదగ్గర చేర్చండి—'

అని చెప్పింది.

'అయితేనూ, గంగన్నానువ్వూ మొగుడూ పెళ్ళాల్లాగే వుంటున్నారా?"

'అదంతా వేరేగొడవ—మీరనన్నటువంటి విషయాలేమీ అడగొద్దు నేనెప్పటికయినా మీదాన్నేగానీ—యింకొకరిదాన్నిగాను.'

'ఆమాత్రం ధైర్యమిచ్చావుచాలు—చేతులారా స్వంతభార్యను పరులపాలు చేశానేమిటా అని, బెంగపెట్టుకొని యేడుస్తున్నాను—"

"మీకటువంటిబెంగ యెప్పటికీన్నివద్దు—కాలమూ ఖర్మమూ యిలాతోసుకొచ్చాయి. ఇదయినా మనమంచికేలెండి—లేకపోతే యింత డబ్బు—ఇన్నివస్తువాహనాలు మనకెలా దక్కుతాయి.'

'నిజమే—కూటికిసయితం కరువుపడి మహాదరిద్రము ననుభవించామింతకాలమూను—అయితే ముందుసంగతేమిటీ?'

"ఇంకోనెలో, రెండునెలలో—అనగా, యీమేడలోని వెండి బంగారాలూ డబ్బు — అన్నీ మనయింటికిచేరేవరకూ యిక్కడుండడము—అనంతరం జై పరమేశ్వరాఅని, మనమిద్దరమూ ఏబొంబాయో—ఏకలత్తాయో—దాటెయ్యడము—"

'భార్యవయినందుకు బహుచక్కటి ఆలోచన ఆలోచించావు గాదూ! పొరబాటున కచ్చేరీలో అన్నాముగదాఅని యీగంగన్నగాడు నువ్వు తనభార్యవేనని తీసుకు చక్కానస్తాడా?'

"అందుకు మనం తగినట్లే చేస్తున్నాముగా?"

'ఇంకా చెయ్యాలి—'

'తొందరపడకండి — వీడు మళ్ళీ కాశీరామేశ్వరాల పాలు గావలసిందే!'

"భూమీబుట్రాకూడా తెగనమ్మించేసి—ఆడబ్బునుకూడా మనమే మూటగట్టుకుపోవాలి.'

'అంతే—అంతే—నాప్లానుకూడా అదే—నని పెట్టారు."

'మనం ఆవిధంగా పారిపోతామే అనుకో—అప్పుడీగంగన్నగాడు తిరిగి మనల్ని పట్టుకుంటాడేమో—'

'ఏడిశాడు. మనం పట్టుబడతామాయేమిటి?'

అని వారామాటా యీమాటా చెప్పుకునేటంతలో వీధితలుపులు చప్పుడయినాయి.

'గంగన్న వచ్చినట్లున్నాడు—యిప్పుడెలాగా?'

అని జానీ ఖంగారుతో అన్నాడు తిలకంకూడా భయపడింది.

'దొడ్డిగుమ్మాన పారిపోతే?'

'అంతేచెయ్యాలి—మెల్లిగా కిందికొచ్చెయ్యి—'

అని తిలకం భర్తను మెల్లిగా మేడదింపి కిందికితీసుకొచ్చేసింది.

"ఇదే దొడ్డిగుమ్మం — వెళ్ళిపొండి — మూటచంకలో పెట్టుకోండి—ఎవరికీ కనపడనీయొద్దు—"

'అలాగే—నువ్వుమాత్రం మనమనుకొన్నప్రకారం త్వరగా చేసెయ్యాలి. నువ్వు యెప్పటికయినా నాదానవేఅని చెప్పావు—'

"అవును—నీదాన్నే—త్వరగా వెళ్ళిపో—"

"ఆమాటే జ్ఞాపకముంచుకోవాలిసుమా! మళ్ళీ యెప్పుడురాను?"

"వీలుగావున్నప్పుడీవేళలాగే నేనుకబురుచేస్తాను — అప్పుడు వద్దువుగాని—'

అనిచెప్పి దొడ్డిగుమ్మాంవ భర్తను పంపేసి, తిలకం యథాప్రకారంగా లోపలకొచ్చి గంగన్నకు తలుపుతీసింది.

'ఇంతసేపేంజేస్తున్నావే! పట్టపగలే నిద్దరోతున్నావా యేమిటి? దొంగలు దోచుకుపోతారుసుమా! ఈవూళ్లో దొంగలభయ మెక్కువ'

అని గంగన్న అనగా—

"అలాగటండీ! యీవూళ్లో దొంగలభయం అంత యెక్కువన్న మాట?'

'ఓయబ్బో! చాలాయెక్కువ—ఓమాటు నడుస్తూ నడుస్తూవుండగానే, నాజలతారుకండువా లాక్కున్నారు దొంగలు."

'ఓయమ్మో! అయితే చాలాజాగ్రత్తగావుండాలి.'

'మరేమిటనుకున్నావ్! అందుకేయింతగా చెబుతున్నాను. ఎన్ని సార్లు పిలిచినా పలక లేదు—లోపల ఏంజేస్తున్నావేమిటి?

"మేడమీదవున్నానండీ! అంచేత మీపిలుపు అంతత్వరగా వినిపించదు."

"అంతేనా?'

"ఇంకేమిటనుకున్నారూ?"

'ఏమీలేదుగానీ—నువ్వుమాత్రం చాలాజాగ్రత్తగా వుండాలి— ఇంకోమాటు ఏమయిందో తెలుసా! రాత్రి నేనొక్కణ్ణే మేడమీద పడుకుని నిద్దరోతున్నాను—ఎవ్వడు ప్రవేశించాడో! ఎలా ప్రవేశించాడో ఓదొంగ మేడమీద ప్రవేశించి, మెల్లిగా నాతలక్రింద తాళం చెవులు సంగ్రహించాడు. ఇనప్పెట్టె తెరిచాడు, ఇంతలో నాకు మెళుకువరావడంవల్ల దొంగ పారిపోయాడు. ఇటువంటివి చాలాసార్లు జరిగాయి. ఈపెద్దవూళ్ళో దొంగలభయం చాలాఎక్కువ. ఈవూరుకు అదొక్కటే—మిగతావిషయాలన్నీ చాలా బాగానేవుంటాయి."

"అంతచేటు దొంగలభయమయితే మనమీవూళ్లో కాపరం చెయ్యలేమండోయ్ దొంగలంటే నాకసలేభయం—దొంగనుచూశానం టేకొయ్యయిపోతాను—మనం యీవూళ్లో మకాముత్తేసి యింకోవూళ్లో వుండాలి—ఈదొంగలవూళ్ళో నేనొక్క గంటయినా వుండలేను.'

"మేడలూ—భూములూ—అన్నీయీవూళ్ళో వుండగా, మనం యీవూరు వొదిలిపెట్టి యెలాపోతాం?'

"అంతేనా!''

'పోనీ నువ్వేదయినా సలహాచెప్పు అలాచేదాం, ఈవూళ్ళోవుం డడానికినాకూడా యిష్టంలేదు.'

'డబ్బుంటే, ఏవూళ్ళోపడితే ఆవూళ్ళోనే కొనుక్కోవచ్చు—ఇళ్ళూ భూములూను—ఇక్కడున్న మనమేడలూ భూములూ అమ్మేస్తే యెవరూ కొనరాయేమిటి?'

'ఎందుకు కొనరూ? బేరంపెడితే, అరగంటలో కొంటారు—'

'అలాఅయితే అమ్మెయ్యకూడదూ? ఏమదరాసులాంటి. పెద్ద పట్నంలోనో మనకుకావలసిన మేడలనూ—భూములనూ కొనుక్కొని సుఖంగా వుండొచ్చు—'

"అవును—అలాచేదామంటావా? నీసలహాకూడా బాగానేవుంది'

"అంతేగానీ యీదొంగలవూళ్లో మీకు విరోధులుచాలామంది వున్నారు?''

'విరోధులెవరూ?'

'విరోధులెవరని మెల్లిగాఅడుగుతారేమండీ! మీరునిజంగాచచ్చి పోతే, మీఆస్తినందరూ తలోకాస్తా పంచుకునేవారు—అలాజరగలేదని, మీమీద అందరకూకక్షగానే వుంటుంది—'

"అవునేవ్! నువ్వుచెప్పిందికూడా నిజమే నామీద చాలామం దికి గుర్రగావుంటుంది—''

'విరోధులున్నవూళ్ళోనూ దొంగలున్నవూళ్ళోనూ ఎన్నడూ వుండకూడదు—సాధ్యమయినంత త్వరలో మకామెత్తెయ్యండి."

'అంతే అలాగే చేస్తాను—రేపు మేడలూ పొలమూకూడా బేరం పెడతాను—నిమిషంలో అమ్ముడయిపోతాయి. మనం ఆడబ్బు పట్టుకుని మన ఇష్టమొచ్చినదగ్గరకు పోవచ్చు—"

'అవును—అదిమనకు అన్నివిధాలా క్షేమకరమయిన వ్యవహారంలా కనుపిస్తుంది.'

'నేను దేనికిచెప్పినా క్షేమకరమయినదానినే చెబుతాను మీరు ఆ ఆస్తిని ఎంతత్వరగా అమ్మేసి డబ్బును చేతిలో వేసుకుంటే అంతమంచిది. ఈవూరునుమనం వీలయినంతత్వరలో వొదిలి లేచిపోవాలి.'

అని తిలకంచెప్పినమాటలు గంగన్నతలకు బాగాయెక్కాయి. అతడామరునాడే మేడలనూ—భూములనూ తాను అమ్మదలుచుకొన్నట్లుగా పదిమందికీ తెలుపుదుచేశాడు ఏమాత్రమయినా తక్కువకయినాసరే అమ్మి డబ్బుచేతులో వేసుకోవలసిందిగా తిలకం గంగన్నను ఏవూటకావూట తొందరచేయడం మొదలుపెట్టింది.

గంగన్నకూడా ఆమర్గాగానేవున్నాడు. ఆవూళ్ళో తనకువిరోధులున్నారని యెప్పుడయితేఅతనికి నమ్మకంకలిగిందో అంతటినుంచీ, ఆవూరును వొదిలిపెట్టెయ్యాలని, అతనుమరింత తొందరపడుతున్నాడు.

చెడిపోయేకాలానికి అనుగుణంగానే బుద్ధులుకూడా కలుగుతుంటాయిగదా!

౮

అంతకుముందింట్లోవున్న రొఖ్కమూ—వెండిబంగారాలూ అంతకుముందే దవదఫాలుగా యింట్లోనుంచి దాటిపోయాయి.

గంగన్న అంతవరకూ ఆవిషయమునే కానుకోలేకపోయాడు.

అనాడుతిరిగి పొలమునూ మేడలనూ ఒకమార్వాడీకివిక్రయించి నలభైవేలరూపాయలను పట్టుకొచ్చి ఆనోట్లన్నీ కట్టకట్టి బీరువాలో భద్రపరిచాడు.

'ఏమేవ్! ఇహామన కేవిధమయిన ఆలశ్యమున్నూ లేదు. డబ్బు చేతిలోపడిపోయింది. నలభైవేలూ బీరువాలో భద్రపరిచాను. ప్రయాణానికి ఎల్లుండి చాలా బావుంది.'

"ఊఁ! కానియ్యండి. మదరాసుపోదామా?"

"నీయిష్టం."

'మదరాసుపోతేనే బావుంటుందని నావుద్దేశం'

"మరయితే అల్లాగేకానిద్దాం. నీయిష్ట మెలావుంటే అలాగే! అక్కడే ఒకమేడ కొనుక్కుని ఖులాసాగా కాలక్షేపం చేదాం.'

"నాకింకోసం దేహముంది'

"ఏమిటో చెప్పు'

'మనకు యిత్తడిసామానులూ, కర్రసామానులూ చాలా వున్నాయిగదా! వీటినన్నింటినీ మదరాసుకుతీసుకుపోవడం చాలా కష్టంగాదండీ?"

'కష్టమే—అందు కేంచేద్దాం?'

“స్థిరాస్తిని ఎలాగా తెగనమ్మి డబ్బుచేసుకున్నాముగాబట్టి ఇత్తడిసామానులు, కర్రసామానులూ మొదలయినవాటినన్నింటినీ కూడా తెగనమ్మేసి డబ్బుచేసుకుని పట్టుకుపోవడం మంచిది. మనకు కావాలంటే మదరాసులో రకరకాలసామాను లుంటాయి.”

‘పోనీ అలాగేచేయొచ్చు — ఈవెధవసామానుల నన్నింటినీ అంతదూరం మోసుకుపోవడం అనవసరమే—’

‘చాలాశ్రమకూడానండీ! రైల్లో యీసామానంతా తీసుకుపోనివ్వరు.’

‘అవును నీఆలోచనే బాగుంది. ప్రయాణం ఎల్లుండిగాబట్టి రేపు మనయింట్లోవున్న సామానంతటినీ బండిమీద బజారుకు మోసుకుపోయి, అరగంటలో వేలంవేయించేస్తాను.’

“బాగుంది. అలాచేయించండి.’

‘సరే’

‘మనయింట్లోని చరాస్తి నంతటినీ అమ్మితే ఏమాత్రం వస్తుందంటారు?’

“కనీసం అయిదారువేలయినా వస్తుందని నాఅంచనా’

‘ఎంతయినా రానియ్యండి—మనం ఆసామానునంతటినీ మదరాసు మోసుకుపోలేము—యిక్కడే ఏదోవిధంగా అమ్మి పారేశామంటే తెరిపిని పడతాం.’

అని తిలకం చెప్పిన మాటలన్నీ గంగన్నకు నచ్చాయి.

ఆమరునాడు అనుకున్న ప్రకారంగా యింట్లోని సామానుల నన్నింటినీ బండ్లమీద బజారుకు మోయించుకుపోయి, అరగంటలో వేలంవేయించాడు. నాలుగువేలరూపాయల నోట్లన్నీ యింటికిపట్టుకొచ్చి, ఆడబ్బునుకూడా బీరువాలో భద్రపరచాడు,

ఒకటిరెండు ట్రంకుపెట్టెలనూ, ఒక బెడ్డింగునూ మాత్రం ప్రయాణానికి సిద్ధంచేసుకున్నారు.

రాత్రి చాలాసేపటివరకూ ఆ యిద్దరూ ప్రయాణానికి సంబంధించిన మాటలే చెప్పుకుంటున్నారు. సుమారు పన్నెండు ఒంటిగంట రాత్రివేళ గంగన్నకు గాఢమైన నిద్రపట్టింది.

తిలకంకూడా అతనితోపాటు నిద్రపోయినట్లే పోయింది. తిరిగి యెప్పుడు లేచిందో యేమో యెవరికీ తెలీదు—

ఖంగారులో లేచి—

"ఏమండీ! ఏమండోయ్! లేవండి—లేవండి—'

అని గంగన్నను తట్టి లేపేటప్పటి కతను మరింత ఖంగారుతో లేచి కళ్ళునులుపుకొంటూ—

'ఏమిటే—? ఎందుకీ ఖంగారూ? ఏమయిందేమిటి?"

అని ఆత్రాగా అడిగాడు.

"ఏమయిందేమిటండీ? మేడకింద ఏమిటో చప్పుడు వినిపించింది రాత్రి తలుపులు భద్రంగావేశారా?'

'జ్ఞాపకంలేదే? దొంగలుగానీ దూరలేదుగదా! ట్రంకుపెట్టెలన్నీ కిందగదిలోవుంచాను డబ్బంతా చిన్నట్రంకులోనేవుంది.'

"ఇహనేం? కొంపమునిగిందన్నమాటే—లేవండి త్వరగా లేవండి పోయిచూదాం!"

"నాకు చాలా భయంగావుంది.'

"మరేమీ భయంలేదు— నాప్రాణానికి మీప్రాణంఅడ్డు— రండి—రండి—'

అసలితిలకం గంగన్నతో, దీపంపట్టుకుని మేడదిగివచ్చి చూచేటప్పటికేముంది?

వీధితలుపులుబార్లా తీయబడియున్నాయి—ట్రంకుపెట్టెలూ లేవు—బెడ్డింగూ లేదు.

గంగన్న గుండెలుబాదుకుంటూ—

"ఇంకేముందీ? సర్వనాశనమూ అయిపోయిందన్నమాటే—వెయ్యివేలరూపాయలతోను ట్రంకుపెట్టెలు ఎగిరిపోయాయి—అయ్యో! ఎంతదారుణం? ఎంతఘోరం!'

అని నెత్తీనోరూ మోదుకుని యేడవడం మొదలుపెట్టాడు.

'ఆడదానిలాగ అలాయేడుస్తే ఏం ప్రయోజనమండీ! తక్షణం వెళ్ళి పోలీసులకురిపోర్టు చెయ్యండీ!"

అని తిలకం ఆతనిని హెచ్చరించింది ఇంతలో గంగన్న యినపెట్టెవున్న గదిలోకిపోయి చూచుకుని—

"ఇదిగో! యినపెట్టెకూడా తీసేవుంది—ఇదెక్కడిఘోరం—"

అని మరింతగుండెలు బాదుకోవడం మొదలుపెట్టాడు.

'అందులోకూడా ఏమయినాపోయినాయా?"

అని, తిలకం ఏమీయెరగనట్లు, ఖంగారుతో అడిగింది.

‘వెండిబంగారాలూ—ఆభరణాలూ—అన్నీ సర్వశూన్యం—ఒక్కటిలేదు. ఊరికివెళ్ళేటప్పుడు వాటినన్నింటినీకూడాతీసి, ట్రంకు పెట్టెలో సర్దాలనుకున్నాను—దేముడేసర్దేశాడు. చివరకు దారిఖర్చుల కయినా డబ్బులేదన్నమాట!—’

“ఎంతపాపమండీ! నిమిషంలో ఎంతజరిగిందీ? రిపోర్టుచెయ్యడానికింకా పోలీసుస్టేషనుకు పరుగెత్తరే?”

‘హుఁ! పోలీసులు! రిపోర్టు! ఏంలాభం—’

అంటూ గంగన్న కూలబడ్డచోటునుంచి మరిలేవలేక పోయినాడు! సర్వనాశనం అయిపోయినాక ఇహానేమిటిలేచేదీ?

౮

చేతిలో రాగిపయిసాఅయినా లేకుండా డబ్బంతాపోయింది. సర్వనాశనమూ అయింది—

గంగన్న గుండె రాయిచేసుకున్నాడు. పోయినదానినిగురించి విచారించిన ప్రయోజనంలేదనీ—ఆదొంగలకోసమే తనసర్వస్వమునూ తెగనమ్మి డబ్బుకు మూటగట్టివుంచాడనీ వేదాంతమార్గము నవలంభించాడు.

తనకు ప్రాప్తంలేనిది తనదికానేకాదనుకున్నాడు.

ఉన్నదంతా ఒక్కమాటు తుడిచిపెట్టుకుని పోయిందిగదా, యిహ ముందుజీవిత మెలాగడుస్తుందాఅన్న జిజ్ఞాసకూడా లేకపోయిందతనికి.

పోయిందిపోగా — ఆమర్నాటిరాత్రి భార్యకూడా పరారి అయిపోనా!

దానితో అతడు మరింత అధోలోకంలోకి కృంగిపోయాడు.

రాత్రి మామూలుగా పక్కలోనే పడుకుంది. ఉదయంలేచి చూచుకొనేటప్పటికి తిలకంలేదు.

'డబ్బనయితే దొంగలెత్తుకుపోయారు — యిల్లాలి నెవరెత్తుకు పోయివుంటారు.''

అని అతడు ఎంతతీవ్రంగా ఆలోచించినప్పటికీ, ఏమీఅర్థం గాలేదు.

"మనిషంత మనిషిని ఒకగ్రాస్తుకుపోనడమేమిటి? నేను చేతిలో కానిడబ్బుయిగా లేని నిర్ధనుడను గానడంవల్ల తన్నుపోషించలేనని ఆమె తనంతటతానే యెక్కడికో వెళ్ళిపోయివుంటుంది.

ఆవిషయమునే నాతో బహిరంగంగా జెప్పిపోరాదూ?

చెబితే నేను పోనీయనని ఆమెఅభిప్రాయపడి వుంటుంది.

కానియ్యి—దేనికయినా నేను విచారించవలసిన పనిలేదు. ఆమె నేను ప్రయత్నంచేస్తే వచ్చిన భార్య గనకనా? పోయినందుకు విచారించడానికి?

నేను చచ్చానని యెవరో నీలివార్త వేశారు? ఆనీలివార్తకు ఫలితంగా భార్యవచ్చిందీ? భార్యవచ్చినందుకు ఫలితంగా యావదాస్తికి రెక్కలొచ్చినట్లు చంకనాకిపోయిందీ? ఆతరువాత ఎలావచ్చినభార్య అలాగే పోయిందీ?

ఆహా! భగవంతుడిలీలలు ఎంతభావగర్భితములు! ఈమాత్రం తెలుసుకోలేక యిల్లనీ యిల్లాలనీ తాపత్రయపడి చావడం — చివరకంతాహుళక్కి. ఇదికూడా నామంచికే తిరిగి పూర్వపు సన్యాసాశ్రమాన్ని స్వీకరించడానికి తగిన సావకాశం లభ్యమయింది. దానిని మించినదిలేదు.

అని తనలో నిశ్చయంచేసుకున్న గంగన్న, జరిగిన ఏఒక్కవిషయమునూ ఎవరికీ చెప్పకోకుండా, తిరిగి ఆమర్నాడే కాశీకి ప్రయాణం కట్టాడు.

ఇప్పుడాతనిహృదయం పరిపూర్ణమయిన విజ్ఞానమును పొందివుంది

'నేనెంతమూర్ఖుడనూ గాకపోతే, ఎవరిభార్యోవచ్చి, నీకు భార్యగావుంటాననంటే, నమ్మి యింట్లో పెట్టుకోవడమేమిటి? అందుకే తగినశాస్తి చేసింది. భాగ్య సరదా పూర్తిగాతీరిపోయింది.

అయినా, ఈరోజుల్లో భార్యలేదు—బిడ్డలులేరు—ఎవరికెవరూ లేరు ఉన్నారనినమ్మినవాడు నాలాగే సర్వవిధాలా భ్రష్టుడవుతాడు—

అయినప్పటికీ నాకుపోయిందిలేదు—ఏకోనారాయణ—ఒంటరిగాణ్ణి ఎక్కడతిన్నా ఎక్కడపడుకున్నా అడిగేవరులేరు.

అని గంగన్న తనస్థితిని గురించి తనలోతాను అనేకవిధాల తల పోసుకుంటూ ప్రయాణమును సాగిస్తూన్నాడు.

మధ్యమధ్య రైల్వేఉద్యోగులు టిక్కట్టు లేదని దింపేస్తూవుంటే దిగిపోతూ, తిరిగి తరువాత మరియొక రైలెక్కుతూ ప్రయాణమును సాగిస్తున్నాడు గంగన్న కేవలం ఒక బైరాగిలాగ.

ఎటువంటిస్థితిమంతుడికెలాంటిస్థితి కలిగిందీ? కావాలని అతి నేమీ చేసుకోలేదు. విధి ఆవిధంగా తోసుకొచ్చేసినప్పుడు తనేం చెయ్యగలడు?

ఒక స్టేషనులో టిక్కట్టుకలక్టర్లెవరూ లేరుగదా అని, ఓమాటు అటూయిటూ చూచుకొని, సరిగ్గారైలుకదిలేసమయంలో హడావిడిగా ఖాళీగావున్న ఒక పెట్టెలో యెక్కేశాడు.

అది ఖాళీగావుందనుకుని యెక్కాడుగానీ, తీరాచూస్తే పరువుల పెట్టె; టిక్కట్టులేకుండా ప్రయాణం చెయ్యడమేగాకుండా సెకండు క్లాసులోయెక్కి కూచుంటే యింకా యేంప్రమాదమొస్తుందో. అని అతడు దిగులుపడుతూనే వున్నాడు. మళ్ళీ దిగుదామంటే రైలు ప్లాటుఫారమును వొదిలిపెట్టింది—ఎలాగ

ఇంతలో—

'ఏయ్! యిది సెకండుక్లాస్—! పరువులపెట్టె—"

అని ఏమూలనుంచో ఒక స్త్రీకంఠం అతనిని హెచ్చరించేటప్పటికి గంగన్న తృళ్ళిపడి ఆదెనకుచూచాడు.

ఆమె తిలకం!

ప్యారిస్ దొరసానిలాగ తయారై ఎవరోపురుషునితో ఆ సెకండు క్లాసు పెట్టెలో ఠీవిగా ప్రయాణమును సాగిస్తూంది.

ఆమె ఎంతప్యారిస్ దొరసానిలా తయారయివున్నప్పటికీ గంగన్న గుర్తుపట్టాడు—

'తిలకం! ఆఁ! నువ్వేనా?'

అంటూ ఆమెకు దగ్గరగా వెళ్ళాడు.

"ఏయ్‌స్టుపిడ్! తిలకంయెవరు? గెటవుట్!"

అని ఆమె కళ్ళెర్రజేసి తీక్షణంగా పలికేటప్పటికి గంగన్న నిలువునా నీరయిపోయాడు.

'గెటవుట్! అవును—నాకీమర్యాద కావలసిందే!'

అని గంగన్న ముమ్మారు లెంపలువేసుకుని, ప్రక్కస్టేషనులో రైలుదిగి మరోపెట్టెలో యెక్కాడు.

కాలవైపరీత్యానికి అతడుగాదు—మరొకరుమాత్రం ఏంచెయ్యగలరూ?

సమాప్తం

Paper Supplied by Party Q. H. E. G. 34.

శ్రీరామప్రెస్, రాజమండ్రి

శ్రీ జంపనవారి క్రొత్తనవలలు.

నా దేశం

దేవదాసి

మొక్కుబడి

సేవకురాలు 1 వ భా॥

సేవకురాలు 2 వ భా॥



శ్రీ కొవ్వలివారి క్రొత్తనవలలు.

కాశీయాత్ర

కామాంధుడు

యముని తీర్పు

చెయ్యిజారాక?

మిస్. లైలా

డబ్బే ప్రధానం

బస్తీపెళ్ళాం

కోతలగాడు

కర్మకాదు

---


వలయువారు:—

వసుపులేటి బాపిరాజు,

శ్రీసత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.